శ్రీః

నారదీయ పురాణాంతర్గత

మహాక్షేత్ర

# శ్రీ తిరునారాయణపుర మహాత్మ్యము.



ఇది

పండితులచే సరిచూడబడి

శ్రీరంగం

ఎ. సుదర్శనం అండు సన్ వారిచే

శ్రీనికేతన ముద్రాక్షరశాలయందు

ముద్రింపించి

ప్రచురింపబడియె.

---

1927

అణాలు 6.] [రిజిస్టరు చేయబడినది.



శ్రీసంపత్కుమారాయనమః.

మేలుకోట యాదవగిరి యను

# శ్రీ తిరునారాయణపుర మహాత్మ్యము

## ప్రథమాధ్యాయము.

పూర్వకాలంబున నొకప్పుడు హరిభక్తాగ్రగణ్యుండగు నారదుండు సత్యలోకంబున వాణీసమేతుండై పద్మాసనంబున సుఖాసీనుండై యున్న నిజజనకుండగు చతుర్ముఖ బ్రహ్మంగాంచి భయభక్తి పూర్వకంబుగ నమస్కరించి యిట్లనియె.

మహాత్మా! సకల ధర్మజ్ఞుండవును, భగవంతుండవునగు మీవలన సకలశాస్త్రంబులును, పురాణంబులును విని కృతార్థుండనైతి. నిక కావేరీతీర మహాస్థలంబులలోని అతిపవిత్రంబును నసమాన పుణ్యవంతమునగు క్షేత్రము నెఱింగింపవేయన నందులకు బ్రహ్మ యిట్లని చెప్పదొడంగె.

నారదా! నీవుచేసిన ప్రశ్నంబు లోకోపకారంబగుటచే సుప్రశస్తంబైయున్నది కావున నెద్దానిని వినినంతనె సర్వయజ్ఞంబు చేసిన ఫలంబును అంత్యంబున శ్రీమన్నారాయణుని జేరి సుఖంబుందురోయట్టి తిరునారాయణపుర మహాత్మ్యంబును వక్కాణించెద సావధాన మనస్కుండవై యాకర్ణింపుము వత్సా!

శ్రీకల్యాణీవిలసద్యతుగిరి నారాయణార్థికల్పతరో ।
సంపత్కుమారభవ తే నిత్య శ్రీర్నిత్యమంగళంభూయాత్ ॥
కమలాకుచకస్తూరీ కర్దమాంకితవక్షసే ।
యాదవాద్రినివాసాయ సంపత్పుత్రాయమంగళం ॥

శ్రీ తిరునారాయణపుర మహాక్షేత్రము భరతఃఖండములోని దివ్యక్షేత్రములకెల్ల మిగుల ప్రసిద్ధిజెందినది యది సహ్యాపర్వతము నకు తూర్పుదిక్కున కావేరినది ప్రక్కనయుండు పుణ్యక్షేత్రము దానికి కృతయుగములో సనత్కుమారునిచే నారాయణాద్రి యని యును, త్రేతాయుగమున దత్తాత్రేయులు వారిచే వేదాద్రి యని యును, ద్వాపరమున శ్రీ బలరామ కృష్ణులవలన యాదవాద్రి యని యును, కలియుగంబున నవతారంబు సేయబోవు యతిరాజులవారి వలన యతిశైలంబని ప్రసిద్ధిజెందును.

మరియు నూటయెనిమిది దివ్యతిరుపతులలో ముఖ్యమైనది గాను, కోయిల్ తిరుమల పెరుమాళ్ కోయిల్ తిరునారాయణ పురం బను నాలుగు దివ్యక్షేత్రములలో నాల్గవదిగాను, జ్ఞానమంటపంబని శిష్టులచే పరమపావనంబై కొనియాడబడును.

యాక్షేత్రమునకు రెండుక్రోసలు దూరములోనుండు ప్రదే శములకెల్లను వైకుంఠవర్ధన క్షేత్రంబని వాడబడును. దీనిలో శెల్వ త్తిరునారాయణస్వామి దేవాలయమును, చుట్టు నుపదేవస్థానము లుండును.

నచ్చటి పర్వత శిఖరమునందు శ్రీ యోగా నృసింహస్వామి దేవాలయమును, పర్వతదిగు పార్శ్వమున శ్రీకల్యాణీ తీర్థంబును, తీర్థమునకుచుట్టు శ్రీవరాహక్షేత్రమును, పంచభాగవతక్షేత్రమును, ఉత్తర పశ్చిమంబున తార్క్ష్యనయనక్షేత్రంబులును, చుట్టును అష్ట తీర్థంబులును గలవు. నారదా! అచ్చట నాదివ్యక్షేత్రములో వేంచే సియుండు తిరునారాయణస్వామి జగత్ సృష్టికాలములో నాయొక్క ప్రార్థనచేత స్వయంవ్యక్త అర్చారూపముగ ఆనందమయ దివ్య విమానముతోడ ఆవిర్భవించి నాచే యీసత్యలోకమునందు అనేక

వేల సంవత్సరములు నారాదింపబడి నాదు మానసపుత్రుడైన సనత్కుమారుడు బహువిధములు నన్ను ప్రార్థింప వానిప్రార్థనలకు నేను సంతసించి, నా ఆరాధనమునకు శ్రీమన్నారాయణుని హృదయోద్భవంబైనట్టి వేరొకమూర్తి నిమ్మని వేడగా భగవంతుడు రామప్రియులను నొక అర్చారూపవిగ్రహంబును నాకొసంగిరి. వారిని నా ఆరాధనమునకు నుంచుకొని, తిరునారాయణస్వామివారిని విమానముతోడ నాసనత్కుమారునకిచ్చితి ఆతండు యాతిరునారాయణపుర మహాక్షేత్రములో ఆనందమయ దివ్యవిమానముతో ప్రతిష్ఠ జేసెను. యాప్రతిష్ఠకు నేనును, శంకరుండును, సూర్యుండును, చంద్రుండును, మహేంద్రుండును నన్యులగు లోకపాలకులును మహర్షులును జని ఆ ఆనందమయ దివ్యవిమాన తిరునారాయణస్వామివారి ప్రతిష్ఠావిభవంబంతయు గన్నులారంగాంచి వచ్చితిమి.

వెనుక బహుకాలపర్యంతము నాసనత్కుమారునిచే నారాధింపబడెను. అనంతరము అవ్విధముగానే దేవతలును, మహర్షులును ఆరాధించుచుండిరి.

త్రేతాయుగమున త్రిమూర్తి స్వరూపంబగు దత్తాత్రేయులవారివల్లనున్న, ద్వాపరయుగమున శ్రీ బలరామ కృష్ణులచేతను ఆరాధింపబడిరి. కలియుగంబున అటువంటి విమానము నొకప్పుడు మట్టిపుట్టచే మరిగియుండినపుడును దేవతలచే నారాధింపబడినది. ఆసమయములలో కామధేనువులు వాటి స్తన్యములచే క్షీరవర్షములు నానుట్టిపుట్టలపై గురిపించిపోవును.

పిమ్మట యతిరాజులువారు భూలోకంబున యవతరించి, దిగ్విజయ మొనరించు కాలములో శ్రీరంగక్షేత్రమునుండి మైసూరు

రాజ్యప్రాంత్యములో ద్వారసముద్రమునందలి హొసలరాజగు విఠల దేవరాయుని కుమార్తెనుబట్టిన పిశాచమును పారదోలి వానిని తన శిష్యునిగ వైష్ణవుని జేసినందున నచటయుండిన పూర్వకపు జైనమతస్తులు వారితో నెదిరించగా. వారలను వాదంబున తనపూర్వాంశపు వేయిఫణాముడులతో కలిగిన యాదిశేషావతారముతో తొండనూరినందు వారలను జయించిరి.

యారాజుని శిష్యునిగజేసుకొని వారికి విష్ణువర్ధనరాయుడని పేరుబెట్టి, యాతనినహాయంబుచేత యాదివ్యవిమానమును బరిష్కరించి జీర్ణోద్ధారణము సేయుమని వారి స్వప్నమున తిరునారాయణస్వామి దెల్పగా, యతిరాజులువారును తొండనూరిలో తిరుత్తుళాయి నందవనములోనుండు నొక బిలద్వారముగుండా తనపూర్వాంశంబుతో తిరునారాయణపురంబునకు వచ్చి యా ఆనందదివ్యవిమానముండు చోటును బరిశీలించి వాటిమీదలి మట్టిపట్టలను శుద్ధపఱచి నారాజ నహాయముతో నచ్చట పండ్రెండు సంవత్సరంబులుండి దేవాలయ గోపరమంటపాదులు గట్టించి నారాధించుచుండిరి.

## ద్వితీయాధ్యాయము,

అనంతరము నారదుండు తరువాత వృత్తాంతంబు వివరింపగోరిన బ్రహ్మ యిట్లనిచెప్ప నారంభించె వత్సా!

ఇంక శ్రీకల్యాణీతీర్థ మొదలగు అష్ట తీర్థంబులును, ఆనందమయ విమానమును, తిరునారాయణులగు మూలమూర్తియు శెల్వప్పిళ్ళయగు ఉత్సవరుంబును, తాయార్లగు యతుగిరినాంచార్లును, పాదములందు బూబినాంచార్లును, తూర్పు తిరుముఖమండలంబుగ నిలుచున్నవారును, గరుడాళ్వారులకు ప్రత్యక్షంబును, అద్వైతిగా నుండి పశ్చిమదేశపు వేదాంతియని ప్రసిద్ధిజెంది వెనుక భట్టరుచే

జయింపబడి విశిష్టాద్వైత సిద్ధాంతమునందు ప్రవేసించి తన్ను జయించిన శ్రీరంగరాజభట్టరు తిరువడియందు ఆశ్రయించిన నంజీయరు అవతరించిన స్థళమిదియే.

యాదవగిరికి సమీపమునుండు దర్భతీర్థ పుష్కరిణ శాండిల్య మహాముని శ్రీమన్నారాయణుని గురించి తపంబుసేయగా నాతని తపసునకు తిరునారాయణమూర్తి ప్రత్యక్షుండై కోరినవరంబు నొసగ మనిన నమ్మునియు కన్నులుదెరచిచూచి యెదుటనిలుచున్న కరుణారస ప్రపూరితమై నీలమేఘచ్ఛాయతో దనరారు యీతిరునారాయణమూర్తినింజూచి, ఓ కరుణాసాంద్రా !

నీవు సృష్టిస్థితిలయ కారణభూతుండవు త్రిమూర్త్యాత్మక శరీరుండవు సకలచరాచర జీవకోట్లందెల్ల బరమాత్మ స్వరూపంబుగా నిండియుండువాడవు, దివ్యమంగళ విగ్రహుండవు, అనంత కల్యాణ గుణసంపన్నుండవు, నిత్యముక్తాది సంసేవ్యుండవు, శరణాగతత్రాణ బిరుదాంకితుండవు, భక్తాభీష్టప్రధాతవు అట్టి నీవు నీయనిర్హేతుక జాయమాన కటాక్షమే ప్రధానముగ నేటికి నాకు నీదర్శన మహాభాగ్యము నొసంగితివి, మహానుభావా నీమహిమల నెఱుంగ దేవతలే యశక్తులన్న నికనేనెంతవాడను ? దేవాదిదేవా ! నేటితో నాజన్మముధరించినది నా కన్నులు గలవుతీరినది అని యిట్లు ప్రార్థించుచు యంజలీబద్ధుండై నిలిచియుండగా మందస్మిత వదనారవిందుండై భగవంతుడు మహామునితో యిట్లనియె.

ఓయీ మునీంద్రా నీభక్తికిని, తపంబునకును మిగుల నానందించితిని నీయభీష్టము నెఱింగింపుమనిన, మునీంద్రుండు దేవా !

నరనారాయణాశ్రమంబగు శ్రీభదరికాశ్రమునకు పోయి నివసించి యుండవలయునని యడుగ అందులకు నారాయణుండు భదరి

కాశ్రమములో వేంచేసియుండునది నేనే, యీ కలియుగములో అటు వైపున గాలి మంచు మొదలగు నానావిధ ఉపద్రవములు కలిగి యుండుటవలన నీవచ్చటికి పోవనశఖ్యంబుగాన ముస్ముందు నేనే యిందుండుదును, కాబట్టి నీవచ్చటికి పోవలదు యని అంతర్ధానం బాయెను.

ఓ నారదా! అదిమొదలు యాశాండిల్య మహాముని దర్భ తీర్థ ఘట్టమునందే భద్రినాధుని సేవించి యానందించుచుండెను, గనుకనే యాతిరునారాయణపుర క్షేత్రమునకు దక్షిణ భదరికాశ్రమని పేరుంగలదు.

## తృతీయాధ్యాయము.

అనంతరము నారదుడు బ్రహ్మాంగాంచి యోమహాత్మా ఆ యాదవగిరియందుండు శ్రీశెల్వాప్పిళ్లె వైభవంబు జెప్పవేయునిన, వత్సా! ప్రథమాధ్యాయమందు నా ఆరాధనముకొరకు శ్రీమన్నా రాయణుండు హృదయోద్భవంబైన శ్రీరామప్రియ నర్చావిగ్రహం బును యిచ్చినట్లుజెప్పియుంటినికదా, ఆమూర్తియే యిప్పుడు శెల్వ ప్పిళ్ళయను పేరుంబడసి యచ్చటనున్నారు.

పూర్వము శ్రీరామచంద్రమూర్తి సీతా కల్యాణమునకు వెనుక కొంతకాలము అయోధ్యానగరవాసం బొనరించి, పితృవాక్య పరిపాలనార్థము దండకాటవిని ప్రవేశించి మహర్షులను సేవించుచు రక్కసుల యుక్కడంచుచు గందమూల ఫలాదులనే భుజించుచు, గొలదికాలములో యాతిరునారాయణపుర క్షేత్రంబుజేరి నచ్చట కల్యాణితీర్థ తీరములో నివసించి అనుదినమును తన తమ్ముడగు లక్ష్మణునితోడను, వైదేహితోడను శ్రీ తిరునారాయణమూర్తిని

త్రికరణశుద్ధిగ సేవించి యానందము పొందుచుండిరి. ఇట్లు తిరునారాయణ దర్శనమునందే లయించిపోయిన శ్రీరామచంద్రులు తన సంకల్పప్రకారము రాక్షసనిగ్రహమును, వారియవతారమును మరచినవారైయుండ ఒకనాటి రాత్రి శ్రీతిరునారాయణులు ఆ రాముల వారి స్వప్నములో నీవు రాజ్యపరిపాలనము సేయునపుడు నేను వేరొక అంశముగా నీవద్దకు వచ్చుచున్నాను. ప్రస్తుతము రావణ కుంభకర్ణాది రాక్షసులను ద్రుంచి లోకముసుజ్జీవింపజేయ శ్రద్ధతీసుకొమ్ము యనిజెప్ప దాశరథియు భగవదాజ్ఞను శిరముపైగొని యచటనుండి బయలుదేరి లంకారాజ్యముజేరి, రావణ కుంభకర్ణాదులను హతముజేసి, విభీషణునికి బట్టంబుగావించి తుదకు సీతతోడ అయోధ్యానగరంబుజేరి పట్టాభిషేకాలంకృతుండై రాజ్యపరిపాలనంబు సేయుచుండుతరి తన కులధన యారాదనంబగు శ్రీరంగనాయకుల వారిని విభీషణికిచ్చి ప్రస్తుతము మన తిరువారాధనకు పెరుమాళ్లు లేకపోయిరిగదా యని చింతించుచుండ దీనింగనుంగొనిన నేను నా యారాదనంబునకు నుంచుకొనియుండిన తిరునారాయణ హృదయోద్భవంబైన రామప్రియులను యాశ్రీరామచంద్రునకు ప్రీతిగనొసంగితి.

వెనుక, రామ కుమారుడైన కుశుండనువారి కొమార్తెయగు కనకమాలికయునుండిరి, పుత్రికయగు కనకమాలికను చంద్రవంశములో బుట్టిన యదు శేకరమహారాజునకిచ్చి పాణిగ్రహణముజేయించి కొమార్తెకునిచ్చు శ్రీదనంబులతో గృహ ఆరాదనములోనున్న శ్రీరామప్రియ నర్చావిగ్రహమునుకూడ కనకమాలికకు నిచ్చిరి. యప్పటిమొదలు శ్రీరామప్రియులు యదుశేఖర మహారాజు ప్రారంభముగా చంద్రవంశములో బుట్టిన శ్రీకృష్ణుని తండ్రి వసుదేవులు పర్యంతము వారియంతఃపురములోనే యారాధింపబడుచుండిరి.

## చతుర్థాధ్యాయము.

అనంతరము నారదుండు బ్రహ్మంగాంచి యోమహాత్మా! ఆ యతుగిరియందుండు యతుగిరినాచ్చియార్ల ప్రభావంబు వివరింప వేయనిన; అందులకు బ్రహ్మ యిట్లని జెప్పదొడంగె.

పుత్రా! యాతిరునారాయణపుర క్షేత్రమందు సనత్కుమారునిచే ప్రతిష్టగావింపబడిన ఆనంద దివ్యవిమానమునకు వాయువ్యమూలలో శ్రీయతుగిరినాచ్చియార్ల దేవాలయ మొకటికలదు.

పూర్వము నచ్చట రాజ్యపరిపాలనము సేయుచుండిన విష్ణువర్ధనరాయుని కాలము మొదలుగ ఆయతుగిరిదేవి బహుకోపావేశమైన వీరలక్ష్మీయంశముతో యుద్ధకాలమందలి నారాజులకు జయంబొనరించుచుండిరి. ఆవెనుక తిరునారాయణమూర్తి తనభార్య వీరావేశంబును మాన్పుటకై కటినిగాచిన గజేంద్ర వరదరూపముతో నామెకు కనుబడగా యప్పటి వీరావేశమునుమాని బహుశాంతముగనుండిరి. యప్పటినుండి నామెకు సౌమ్యనాయకియని పేరుకలిగెను. వెనుక తురుష్కులవలన కలిగిన యుద్ధములో తద్దేశీయ క్షేమార్థము కొరకు యాదేవినప్పుడు రాజ్యముసేయుచుండిన తిరుమలరాయుని స్వప్నములో అభయప్రదానమిచ్చి నాయుద్ధమందు నాతురుష్కులను జయింపజేసిరి.

మఱియు, నారదా! హిరణ్యకశుపుని కొమారుండైన ప్రహ్లాదునికి తైలధారవతవచ్చిన్నస్మృతి సంతానరూపధ్యానమునకు ప్రత్యక్షంబైన యాప్రహ్లాదవరదుడు నచ్చట తూర్పుదిక్కున నృసింహాగిరి శిఖరములో యోగా నృసింహమూర్తిగా భక్తులకందరికిని కోరినవరము లొసగుచుందురు. ఈ దిట్లుండగ,



మేలుకోట యోగనృసింహస్వామి.

పూర్వకాలమున వ్యాస, అంబరీష, శుక, పుండరీక, రుక్మాంగద మొదలుగాఁగల మహామునులుగూడి వారితపస్సులకు యోగ్యమైనటువంటిదియు రాక్షస సంచారములేనట్టిదియగు మహాక్షేత్రం బెద్దియని యొండొరులు విచారించుకొనగా, యాతిరునారాయణపురక్షేత్రమే తగుమైనదని దెలిసికొని యచ్చటికేగి యామహామునులు కొంతకాలము తపోధనులై యుండి వెనుక నృసింహగిరి శిఖరములోనున్న యోగానృసింహమూర్తిని సేవించి యానందపరవశులై యమ్మునీంద్రులు నరహరి స్వరూపుండగు శ్రీమన్నారాయణునింగాంచి యోస్వామీ! నీదుమాహాత్మ్యం బెఱుగ నెవరికి శక్యంబు అనంత కల్యాణగుణ సముద్రుండవగు ఓ నారసింహమూర్తీ మాకెప్పుడును నీయందు నిశ్చయంబగు భక్తియును నీకెప్పుడును మాయందు సుస్థిరంబగు వాత్సల్యంబును గలిగియుండునట్లనుగ్రహింపుము.

**మరియు** భక్తియుక్తులగు జనంబులచే సేవింపబడుచు తత్తత్కాలోచితంబులగు వారియారాధనంబులకు బరితృప్తుండవై వారలమనోరథంబులెల్ల ఫలింపజేయుచు నీయాశ్రితులనెల్లను బరిపాలింపుచు నిఖిలలోక సంరక్షకుండవై సకలపురజనంబులచే సేవింపబడుచు శ్రీవైకుంఠంబువలె నిచ్చట పరమానందభరితుండవై యెప్పుడును నివసించియుండుమని ప్రార్థించి శ్రీకల్యాణి తీర్థమునకు పశ్చిమభాగమున జ్ఞానవంతులకు వాసస్థానమైన జ్ఞానాశ్వత్థ వృక్షపునీడను తపోనిష్ఠులైరి.

పంచమాధ్యాయము.

అనంతరము నారదుండు చతుర్ముఖునింగాంచి తండ్రీ నికశ్రీకల్యాణితీర్థ దన్మాహాత్మ్యంబును జెప్పవేయనిన, ఓయి నారదా, దానింజెప్పెద తత్ప్రభావంబంతయు నత్యంతాశ్చర్యకరంబై యుండు కావున సావధానంబుగ వినుమని యిట్లనియె.

దీనికిముందు జెప్పంబడిన నృసింహగిరికి యుడుగుభాగమున శ్రీకల్యాణపుష్కరణి తీర్థమున్నది. పూర్వము శ్రీమన్నారాయణుండు వరాహరూపము దాల్చి సముద్రములో అణిగి మరిగియుండిన భూమిని పైకెత్తుకొని వచ్చునపుడు వారి దేహమందుండి వ్యాపించిన చెమట నీరే యాపుణ్యతీర్థంబైనది.

మున్ను నామానసీక పుత్రుండైన సనత్కుమారుని కిచ్చిన ఆనందమయ దివ్యవిమాన ప్రతిష్టాసమయమునకు వచ్చిన మహర్షులు ఆకల్యాణి తీర్థములో స్నానానుద్యనుష్టానంబులు ముగించుకొని ఆనందపరవశులై యామహాతీర్థముచుజూచి కల్యాణీ కల్యాణీ యని ఆశీర్వదించిపోయిరి. ఆ వాచకమునుబట్టియే నది కల్యాణీ తీర్థంబాయెను. యామహాతీర్థమునందు స్నానమాచరించు వారలకు పుష్కరం, ప్రయాగ, గంగా, యమున, సరస్వతి, నర్మద మొదలగు తీర్థములలో స్నానము జేసిన ఫలమునకన్న యాతీర్థ ఫలమధికము.

సంతానము లేనివారు యాతీర్థమందు భక్తిపూర్వకముగా స్నానమాచరించిన పుత్రులు గలుగుదురు.

కల్యాణితీర్థ తూర్పుఘట్టున శ్రీవరాహక్షేత్ర మొకటికలదు నచ్చట శ్రీమన్నారాయణుండు లక్ష్మీవరాహస్వామిగా భూమిదేవికి ప్రత్యక్షుండైయున్నాడు.

తీర్థమునకు దక్షిణఘట్టున సీతారణ్యక్షేత్ర మొకటికలదు. నచ్చట సీతారామలక్ష్మణులు దండకారణ్యములో సంచరించినపుడు అధిక దాహమైనందున భాణప్రయోగముచే వచ్చినటువంటి తీర్థము యా తీర్థమునకు ధనుష్కోటియను పేరుగలిగి యాకొండకు దక్షిణపార్శ్వ లగా ప్రవహించుచున్నది.



శ్రీ కల్యాణితీర్థము.

ఈ కల్యాణికి పశ్చిమగట్టున ముందుజెప్పిన వ్యాసాంబరీషాదులు తపోధనులుగానున్నారు. దానికే పంచభాగవత క్షేత్రంబని జెప్పుదురు. నుత్తర పశ్చిమంబున తార్క్ష్యక్షేత్ర మొకటికలదు. నచ్చట పూర్వము గరుత్మంతుడు శ్వేతదీపమునుండి వచ్చి వసించుచుండెను. నుత్తరంబున నయనక్షేత్రం బొకటికలదు అందులో కేశవప్పెరుమాళ్ళ దేవాలయమున్నది విను నారధా !.

ఆ కల్యాణి పుష్కరణిలో మూడుదినంబులు స్నానజపతపాదులునొనరించి పర్వతశిఖరములోనున్న యోగానృసింహస్వామినిన్ని తిరునారాయణస్వామినిన్ని ఎవరు భక్తితో పూజింతురో వారు ద్వాదశాశ్వమేదంబు లొనర్చినంత ఫలంబును మఱియు ననేకవేల జన్మంబులందు మనోవాక్కాయ కర్మంబులం జేసిన పాపమంతయు నశించును నారదా, వేయుమాటలేల నీతీర్థంబునందొనర్చు స్నానధానంబులవలన గలిగెడు ఫలంబింతయని వివరించి జెప్పుటకు చతుర్ముకుండనైన నాకు శక్యంబుగాదు. సకల పాపనాశకరంబగు నీ కల్యాణీ తీర్థమహాత్మ్యంబంతయు నీయందుండెడి వాత్సల్యంబున విశధీకరించితి. ఈ తీర్థమహాత్మ్యంబును పఠించువారును వినువారును సకల మనోరథంబులం జెందుదురు. ఈ తీర్థస్నానంబున ననేక జన్మార్జితంబులగు బ్రహ్మహత్యాది మహాపాపంబులెల్ల భస్మంబులగునని బ్రిహ్మ నారదునకుంజెప్పిన నతండమితానంద భరితుండయ్యె.

## షష్ఠాధ్యాయము.

పూర్వము నాంచే వరంబుబడసిన హిరణ్యాకశిపుడు గర్వించి తనబలంబును దేవతలపై జూప, యింద్రాది దేవతలందరు నావద్ద మురలిడ యాదేవతలతో నేనుంగలసి క్షీరసముద్రములో ఆదిశేషునిపై శయనించి అనంతగరుడాది సేవ్యమానుండైన యాశ్రీమన్నారా

యణుని భయభక్తిపూర్వకముగ స్తోత్రింప భక్తవత్సలుండు మాను
సదృంశ్యుండై మాకోరికలనుదెలసి మాకభయంబిచ్చి, నృసింహావ
తారుడై యాహిరణ్యకశుపునిబరిమార్చి ప్రహ్లాదునిగాచి మమ్ములను
రక్షించెను.

అట్టి ప్రహ్లాద కుమారుండైన విరోచనుడు క్షీరసముద్ర
ద్వీపమునందు కొంతకాలము వాసముచేయుచుండెను.

యా క్షీరాబ్ధిశయనుడు యోగనిద్రాపరవశంబైన సమయ
ముజూచి వారి కిరీటంబును అపహరించుకొనిపోయి పాతాళలోక
ములో దాగియుండెను.

యోగనిద్రమేల్కాంచిన శ్రీమన్నారాయణుండు యీ విష
యమును గరుత్మంతునికి దెలియజేయగా వారు పాతాళలోకమున
కుంజని యావిరోచనునితో పోరాడి యాకిరీటముతో భూలోకంబు
నకు వచ్చెను.

నచ్చట భూలోకంబున నారాయణ స్వరూపంబై యవత
రించియున్న శ్రీకృష్ణమూర్తిని సేవింపదలచినవాడై బృందావన
క్షేత్రమునకుబోయెను.

నచ్చట పశువులును మేపుచు వేణునాదంబు సేయుచు గోప
గోపీబాలకులతో బాలలీలావినోదములు సేయుచున్న యా కృష్ణ
మూర్తినిగని యానందముప్పొంగ తన్ను మరచినవాడై తాదెచ్చిన
యాకిరీటంబును నచట యుంచ నాకృష్ణపరమాత్మ యాకిరీటంబును
జూచి విస్మయంబంది నొకంత తానుధరించను. యాగరుత్మంతుని
యడుగ వారును అట్లే వారికిధరింపగా నదివారిశిరంబునకు సరిపోల్చ
బడియుండెను.




వైరముడి శేవ.

నప్పుడు కృష్ణమూర్తి తనదింట తిరువారాధనములోనున్న శ్రీరామప్రియునకు నాకిరీటమును సమర్పించి చూడవలయునని యాశక్తిగలిగినవారై యాగరుత్మంతుని వినయపూర్వకముగానడిగిరి.

యాగరుత్మంతుడు దానికి ఒప్పుకొనగ యా అనిరుద్ధ కిరీటమును అంతఃపురములోనున్న శ్రీరామప్రియ నర్చావిగ్రహమునకు శిరస్సునందుంచగా నదియు సరిపోల్పబడియుండెను.

నారదా యిచ్చట నొక విశేషము ? యా తేజోమయంబైన కిరీటము క్షీరాబ్దినందు శయనించియున్న రెండున్నరలక్ష యోజన నిడివిన్ని అందులకు దగిన చుట్టు పరిమితియుగల శ్రీయఃపతి శిరమునకు సరిపోల్చబడిన యాకిరీటము శ్రీకృష్ణపరమాత్మకున్ను వారికి చాలా చిన్నపరిమితిగల నర్చాస్వరూపుండైన శ్రీరామప్రియులకును సరిపోల్చబడిన దానిచూచి నాగరుత్మంతుడు విస్మయంబొంది శ్రీకృష్ణమూర్తి యాజ్ఞబడపి నాకిరీటముతో క్షీరాబ్దికిబోయి జరిగిన వృత్తాంతంబెల్లయు యానారాయణమూర్తితో జెప్పెను.

వారదివిని అధికసంతోషచిత్తులై ఆకిరీటమును భూలోకమందున నర్చావిగ్రహ స్వరూపుడగు యారామప్రియులకేనుంచి రమ్మనిన యాగరుత్మంతుడును నాలాగేనుంచిబోయెను.

గనుక ఆకిరీటము (వైనతేయులు) అనగా గరుత్మంతునివలన తెచ్చియుంచినదిగాన వైనముడి యనియును వెరుక వైరముడి యనియును సిక వైరము అనగా వజ్రములు ఆవజ్రములతో పొదిగింపబడిన యాకిరీటమునకు వైరముడియని పేరుకలిగినది.

వత్సా ! యిదియిట్లుండ శ్రీకృష్ణమూర్తి యన్నయగు బలరాముడు తీర్థయాత్రలం జేసి వెనుక యాతిరునారాయణపుర క్షేత్ర

మునకువచ్చి శ్రీకల్యాణితీర్థమునందు స్నానమాచరించి గిరిశిఖరము లోనున్న యోగానృసింహులను సేవించి పిదప తిరునారాయణమూర్తిని దర్శనముజేయుగా వారి అంతఃపురములోనున్న రామప్రియుల కున్ను, తిరునారాయణమూర్తికిన్ని యేవిత్యాసము లేనిదిజూచి ఆశ్చర్యంబొంది నచ్చటనుండి బయిలుదేరి బృందావనమునకుంజేరి యాతిరునారాయణపుర క్షేత్రవృత్తాంతములను శ్రీకృష్ణునికి తెలియజేసిరి. అదివిని వారును శ్రీతిరునారాయణుని సేవింప మనసు కలిగినవారై సపరివారంబుతో అన్నదమ్ములును, నర్చారూపుడగు రామప్రియులను నెత్తించుకొని యాతిరునారాయణపుర పుణ్యక్షేత్రముజేరిరి.

వెనుక యచ్చటనున్న తిరునారాయణస్వామిని సేవించి, తాముదెచ్చిన యారామప్రియులను నచ్చటి తిరునారాయణస్వామి వారితో నేక సింహాసనముననుంచి ప్రతిష్ఠజేయుంచి సేవించి యానందించుచుండిరి.

ఇట్లు అదిమొదలుగా కొద్దికాలము యదువంశపు రాజులెల్లరును వంశపరంపరగా యాదవగిరియందే రాజ్యముసేయుచునుండిరి వీరివలననే దానికి యాదవాద్రియని పేరుకలిగినది.

బహుకాలమునకు వెనుక కలియుగంబున డిల్లీరాజ్యంబునకు అధిపతియగు భాదుషా ననేక స్థలంబులలోనున్న అర్చావిగ్రహము లను కొల్లగొట్టినపుడు యా యాదవాద్రియందుండు రామప్రియు నర్చావిగ్రహంబును కొల్లగొట్టి గొంచుకపోయిరి. నప్పుడు డిల్లి భాధుషా కుమార్తెయగు వరనందిని యావిగ్రహములను జూచి నందులో రామప్రియుల విగ్రహము ముచ్చటగానున్నదని జూచి తాను ఆట్లాడుకొనుటకు తనయంతఃపురమునకు గొనిపోయినుంచుకొనెను.

తొల్లి తిరునారాయణస్వామికి దేవాలయ గోపుర మంటపాదులు గట్టించిన రామానుజులువారు బ్రహ్మోత్సవంబుసేయ నుత్సవవిగ్రహంబు లేదేయని చింతించియుండ వారిస్వప్నములో తిరునారాయణులు సేనసాధించియిందుయుండిన నర్చావిగ్రహము నిపుడు ఢిల్లీ భాదుషా నంతఃపురములో వానికుమార్తచేలీలకొనియాడుచున్నారు నీవేగి తెమ్మనిజెప్పిరి.

అనంతరము, నా రామానుజులువారు సన్యాసులతోడను శాత్తిన శాత్తాద శ్రీవైష్ణవులతోడను భాగవతగోష్ఠితోడను (తిరుకుల్లత్తారను పంచమ దాసులతోడను) జేరి ఢిల్లీ నగరంబునకు బోయిరి.

వచ్చిన యీ సమూహంబును భాదుషా ననేకవిధంబులుగ గొనియాడి వచ్చినకార్యంబేమని యడుగ నందులకు రామానుజులువారు మేము తిరునారాయణపుర మహాక్షేత్రవాసులము మాయారాధనవిగ్రహము మీచేగొల్లకొట్టంబడి నిందువచ్చియున్నారు. వారిని మాకిమ్మనియడుగ.

అప్పుడు భాదుషా వారినగర ఉగ్రాణము దెరిపించి మీవిగ్రహమును వెదకి యెత్తుకొనిపొండు యనిజెప్ప, ఉగ్రాణమందు నాయర్చారూపుడు లేకుండుటయుం దెలసి నాభాదుషాతో రాత్రి నా స్వప్నంబున మాదేవుడు మీకుమార్తె యంతఃపురములో నుండునట్లు నాకు తెలియజేసిరి గాన, వారిని దెప్పించి మాకిచ్చిన మేము సంతోషచిత్తులైపోయెదమని చెప్పగా, నందులకు మీదేవుడు నిజంబైనచో నీవుపిలచిన వచ్చునాయని యడుగ, నందులకు ఆక్షేపంబులేదు. వత్తురుయని ప్రత్యుత్తరంబివ్వ యెదోజూతము పిలువుము అనగా,

నప్పుడు యతిరాజులువారును భగవంతుని ధ్యానించి బిలువ నంతఃపురములోనున్న అర్చావిగ్రహ రామప్రియులు వారిపాదము లందున అందెలు ఘల్లుఘల్లుమన విభవావతారంబుతో నొక చిన్ని బాలునివలె నడచి యతిరాజులవారి యొద్దకు రాగా వారునత్యంత సంతోషపులకాంగితులై వారిశిరము మూర్కొని ఎనదు శెల్వపిళ్ళ యేయని (నాదు సంపత్కుమారా) నత్యంత ప్రీతితో కౌగలించుకొని ఆనందించిరి.

వీటినంతయు కన్నులు పండుగ జూచిన యాభాదుషా నధిక సంతోషప్రీతితో సన్మానములుజేసి యా యతిరాజులవారికి నా యర్చావిగ్రహంబగు రామప్రియులను నిచ్చి బంపెను. అటుపైని నాభాదుషా ప్రియ పుత్రికయగు వరనందిని తనప్రియనాధుని వదలి నొక నిమిషంబైనను ప్రాణంబుతో నుండజాలనని రోదనంబుసేయ నా ప్రియ పుత్రిని వారివెంటనే జేర్చి బంపెను. అదిమొదలు నా రామప్రియులకు శెల్వప్పిళ్ళయను నామంబు ప్రసిద్ధియైనది. భాదుషా పుత్రికయగు వరనందినికి బూబినాచ్చియారని నామంబు గలిగినది. వారికి ప్రత్యేకసన్నిధియు నొకటికలదు.

వారు ఆసన్నిధి గర్భగుడిలోనుండు బిలద్వారముగుండా వచ్చి శెల్వప్పిళ్ళ, తిరునారాయణస్వామివారి పాదములోకూర్చుండి సేవసాయించుచున్నారు.

అటుపై రామానుజులువారు ఉభయనాచ్చియార్లు మొదలగు అర్చావిగ్రహంబులను యేర్పాటుజేయించి సంపంగివృక్షమూలములో కనుబడిన తాయార్ల విగ్రహమునకు యతుగిరినాయకి యని పేరుబెట్టి నిత్యోత్సవ, పక్షోత్సవ మాసోత్సవ, కల్యాణోత్సవ,



యతిరాజ సంపత్కు-మారులు.

బ్రహ్మోత్సవ, వైరముడి మహోత్సవ, రథోత్సవ తెప్పోత్సవాదులు నతివైభవంబుతో జరిపించి సేవించుచుండిరి.

## అష్ట తీర్థములు.

1. తిరునారాయణ పురమునందు వైకుంఠగంగ యనేడు యొక నది ప్రవహించుచున్నది. పూర్వము మహాబలిచక్రవర్తి నిగ్రహమునకుగాను వామనావతారుండగు యీ నారాయణుడు త్రివిక్రమావతారంబుదాల్చి నొకపాదము బ్రహ్మాండకటాహ పర్యంతము నెత్తి గొల్చినపుడు చతుర్ముఖుడు యీ పాదమును మందాగ్ని తీర్థంబుతో కడిగి యారాదించగా నావిశేషము జూచిన నిత్యసూరులు విరజానది తీర్థంబుతో శోదించి సేవించిరి.

ఈ రెండు తీర్థములును గలసి శ్రీహరిపాదమునుండి వచ్చినందుచేత దీనికి వైకుంఠగంగ యని పేరుగలిగినది. ఇచ్చట శ్రీభక్తిసారులను, యోగీశ్వరులును తపోనిష్టులైయున్నారు.

2. వైకుంఠగంగకు దక్షిణభాగమున నారాయణతీర్థ మొకటికలదు అందులో శ్రీవిష్ణుచిత్తులు స్నానానుద్యనుష్ఠానంబులు చేసుకొనుచుండిరి.

3. కల్యాణి నారాయణ తీర్థములకు మధ్య మైత్రేయ తీర్థమున్నది. నిచ్చట శ్రీపరాశరులవలన మైత్రేయరుషికి శ్రీవిష్ణుపురాణోపదేశంబు జరిగినది.

4. తిరునారాయణపురికి వాయువ్యమూలలో దక్షిణముఖముగా యాదవనదియను ఒక పుణ్యనది ప్రవహించుచున్నది, యీ గట్టున యాదవేంద్రుండనురాజు హటయోగము జేసి యింద్రపదవిని

జెందెను. దీనికి పూర్వభాగమున యాదవసరస్సు అను తీర్థ మొకటి యున్నది.

5. యీ తిరునారాయణపుర దక్షిణభాగమున పరిదాన శిలావిగ్రహం బొకటియున్నది. నచ్చట భగవంతుడు పాషండనిరస నార్థము కొరకు త్రిమూర్తి స్వరూపులగు దత్తాత్రేయ రూపముగ నాలుగు వేదపురుషులను శిష్యులుగ జేసుకొని అచ్చట సేవనిచ్చు చున్నారు అందే వేదపుష్కరిణియున్నది.

6. యాదవగిరి మీదిభాగమున తూర్పుప్రక్కలో దర్భతీర్థ మున్నది. అచ్చట శాండిల్యమహాముని పాంచరాత్ర ప్రమాణ ముతో ధర్మసంతర్పణం గావించిరి.

7. దర్భతీర్థమున కుత్తరభాగమున ఫలాశతీర్థమున్నది, పూ ర్వము త్రిశంకుమహారాజుని యాగప్రసంగమున విశ్వామిత్రుని శాపముచేత చండాలురైన వసిష్ఠపుత్రులు యాతీర్థస్నాన మహాత్మ్య ముచేత చండాలత్వము నివర్తియైనది అందుచేత నాతీర్థమునకు పతిత పావన తీర్థంబని ప్రసిద్ధిజెందినది.

8. ఫలాశతీర్థమునకు ఉత్తరభాగములో పద్మతీర్థముకలదు బ్రహ్మపుత్రులైన సనత్కుమారులు ఆసరోజాతమైన కొలనులోని పద్మములను తిరునారాయణస్వామికి సమర్పించి పూజించుచుండిరి.

యీప్రకారము యాదవగిరికి నలుప్రక్కలను అష్టతీర్థము లును శ్రీమదష్టాక్షరీమంత్ర ప్రభావంబుతో ఐహికాముష్మిక ఫల ప్రధాన మహాక్షేత్రంబుగనున్నది.

పూర్వము యదువంశపు రాజులలో నొకడు నచ్చట పర్వత మునకు నలుప్రక్కల కోటకట్టించి మేలుకోటయని పేరుబెట్టెను




రాజముడి శేవ.

గాన యీతిరునారాయణపురమునకు మేలుకోటయని పేరు ప్రసిద్ధి యైనది.

## బ్రహ్మోత్సవము.

యీతిరునారాయణపుర మహాక్షేత్రమునందు ఫాల్గుణ శుద్ధ రోహిణీనక్షత్రమునాడు బ్రహ్మోత్సవ ధ్వజారోహణమున్ను దీనికి ముందురోజున శ్రీకల్యాణి పుష్కరిణితీర మండపమునందు తిరుక్కల్యాణోత్సవమున్ను, పుష్యమి నక్షత్రమునాడు రాత్రి వైరముడి మహోత్సవమును, మరునాడు రాజముడియును, వెనుక రథోత్సవమును హస్తనక్షత్రమునాడు కల్యాణి పుష్కరిణియందు జరుగు తీర్థవారి ఉత్సవమును, మరునటిరోజున శహస్రకలశ తిరుమంజనమును మూలవర్లుకు మంజళ్ కాపు (చూర్ణాభిషేకం) సేవయు, ఆరాత్రి మూలవరులతో ఉత్సవర్లు గర్భగుడియందుండుటయు గర్భగృహ ప్రదిక్షణమున్ను, మరుదినము అన్నకోటి మహోవుత్సవమును జరుగుచున్నది.

## శ్రీమద్రామానుజ చరిత్ర సంగ్రహము.

శ్రీపెంరుంబూదూరను దివ్యదేశంబులో నివసించియుండిన భగవతాగ్రగణ్యులగు ఆసూరి కేశవాచార్యులకును తత్పత్నియగు కాంతిమతియందు కలియవతరించిన నాలుగువేల నూటపదునెనిమిదవ సంవత్సరం (అనగా రమారమి హూణశకాబ్దము 1017 సంవత్సరములు) పింగళ సంవత్సరం చైత్ర శుక్ల పంచమి గురువారం ఆర్ద్రానక్షత్ర శుభముహూర్త శుభలగ్నమందు పుత్రుండై యవతరించెను. వీరికి ఆసూరి కేశవప్పెరుమాళ్లు జాతకర్మము జేయించి వీరు యవతరించిన పన్రెండవ దినమున పెరియతిరుమల నంబులచే నామకర్ణంబులు జేయించి ఇళయాళ్వారని పేరుబెట్టిరి.

వెనుక అన్నప్రాశన చౌళోపనయనాదులు క్రమేణ జరిపించి మిగుల గారాబముగ పెంచుచుండ, నబ్బాలుండు శుక్లపక్ష చంద్రునివలె దినదినం బభివృద్ధినొందుచు నుపనీతుండై వేదవేదాంగముల నభ్యసించి వివాహంబై పదియారేండ్ల ప్రాయమున సంపూర్ణ జ్ఞాన తేజోవిరాజమానుండై అప్పుడు కాంచీనగరమునందుండిన అద్వైతియగు యాదవప్రకాశునివద్ద మీమాంసార్థంబుల వినంగోరి యాతనివద్దజేరి నభ్యసించి వెనుక తిరుక్కచ్చినంబులు మూలముగ దేవప్పెరుమాళ్ (కాంచీనగరమునందలి పెరుమాళ్ళు) కృపాకటాక్షమునకు పాత్రులై వారినే తన తిరువారాధన పెరుమాళ్ళుగా గొని వారికి తీర్థ తిరుత్తుళాయి మొదలగు పుష్పకైంకర్యములు జేయుచు నచ్చటయుండిరి. వెనుక, వీరు తిరుక్కచ్చినంబిచే సంస్కారంబులు లభించుకొనవలయునని వారిని ప్రార్థింప వారు ధర్మవిరుద్ధంబగు కార్యంబున కొడంబడనని బలికె.

అంత రామానుజుండు శ్రీకాంచీపూర్ణుని (తిరుక్కచ్చినంబి) భుక్తశేషాన్నంబు భుజియించినైన యుజ్జీవింతునని తలచి యొకనాడు తిరుక్కచ్చినంబిని తనదింట భుజింపవలయునని ప్రార్థింప వారట్లే యొప్పుకొనిరి.

అంత ఇళయాళ్వారులు అనుష్ఠానంబు దీర్చుకొని శ్రీకాంచీపూర్ణుని యింటికిందోడ్కొని రావడమునకు దక్షిణమాడవీధిగరాగ తిరుక్కచ్చినంబులు నుత్తరమాడవీధిగా వచ్చి ఉడయవరుల గృహంబునకుం జని వారిదేవులను అన్నంబిడుమని యారగించి త్వరితగతిగా తిరువాలవట్ట కైంకర్యమునకుం జనెను.

నంబులను తోడ్కొని రావడమునకు పోయిన ఉడయవరులు మఠమునందు తిరుక్కచ్చినంబిని గానక స్వగృహంబునకు మఱలి వచ్చి అటస్నానంబానరించుచున్న స్వపత్నింజూచి కారణంబడుగ నాబిడయు శాత్తాధ నా శ్రీవైష్ణవులు యారగించిన స్థళమును శుద్ధి చేసిన కతంబున స్నానంబుచేసెదనని బలుక, ఇళయాళ్వారులగు నా రామానుజులు మిగుల చింతించి తనభార్య నొనర్చిన యకృత్యం బునకు సహింపకయుండె.

తదనంతరము శ్రీరామానుజుండు పెరియనంబిని నాశ్రయింప గోరి శ్రీరంగమునకు ప్రయాణమై బోవుచుండ మార్గమధ్యమున కనుబడిన యాపెరియనంబియు శ్రీరంగనాథుని యాజ్ఞాపేరితుండై ఉడయవరులకు పంచసంస్కారంబులు జేసి మంత్రరాజంబును ఉపదే శించెను.

అంత ఉడయవరులు పెరియనంబులను తనగృహమందే నుంచుకొని వారిచే ద్రావిడవేదము, వాస్యసూత్రములు మున్నగునవి వినుచుండిరి.

ఇట్లుండ నొకనాడు రామానుజులువారు తనకు తైలమంటి స్నానము జేయించిన నొక శ్రీవైష్ణవునకు చల్దియన్నము బెట్టుమని తనదేవుల కాజ్ఞసేయు నాపె రాత్రియన్నము యేమియు మిగులలేదని నుడివెను. అదివిని ఉడయవరు లాపెమాటయందు సందేహించి లోనికివెళ్ళి జూడగ ఇద్దరికి చాలినంత చల్దియున్నముండుట జూచి భార్యయెడల మిగుల కోపముగలవారై యుండిరి.

అంత మరియొకనాడు రామానుజులువారు స్నానమాడ బోయి యుండునపుడు పెరియనంబిగారి దేవులకును, ఉడయవరుల

దేవులకును బావిఘట్టున ఒక ఘటవిషయమై కలహమేర్పడ పెరియ నంబి అదితెలసి తనభార్యపై కోపగించుకొని యిక నిచ్చటయుండిన అపచారహేతువగునని నుడయవరులకు జెప్పకనే శ్రీరంగమునకు వెళ్ళిపోయిరి.

అంత శ్రీరామానుజులు స్నానానుద్యనుష్ఠానంబులు దీర్చుకొని గృహంబునకువచ్చి పెరియనంబులను గానక జరిగినదేమని తమ దేవులనుజూచి యడుగ జరిగిన ఘటకలహమును వారికిజెప్పిరి. యది విని చాలా చింతాక్రాంతులై దేవులనుజూచి ముందు తిరుకచ్చి నంబుల విషయమున నడుచుకొన్న రీతియు, పిమ్మట తైలమంటిన శ్రీవైష్ణవునియెడ ప్రవర్తించిన విధంబును ఇప్పుడాచార్యుల దేవుల విషయంబున అపచారపడినదియు సహింపగూడనివి? కావున నిక మీాదు నీతోడి సాంగత్యము నాకు సరిపడదని తక్షణమే వారి సంబంధమైన ధనమును నొసంగి వారి పుట్టింటికి బంపి, వెనుక శ్రీదేవ రాజప్పెరుమాళ్ళ సన్నిధికరిగి తన్మూలముగ కాషాయత్రిదండాదులనుపొంది సన్యసించి యాకాంచి వరదరాజులచే అర్చకముఖేన యతిరాజయను నామము బడసిరి.

వెనుక శ్రీరంగక్షేత్రమునందు పెరియపెరుమాళ్ళ సేవమున తిరువరంగ ప్పెరుమాళరయరు కాంచీనగరమునకుపోయి వారి నృత్యగానములవలన యావరదరాజులను సంతోషపఱచి వారి యాజ్ఞచే ఇళయాళ్వారులను యతిరాజులనుదెచ్చి శ్రీరంగమునందు నంబెరుమాళ్ళవశమున వప్పగించిరి. వారును యాదేవప్పెరుమాళ్ళ యాజ్ఞ శిరసావహించి యానంబెరుమాళ్ళు సన్నిదియందే నిత్యవాసముజేయుచు శ్రీఆళవందారుల ప్రతిజ్ఞ నెరవేర్చి శ్రీభాష్యగ్రంథ రచనప్రవచనమును శ్రీరంగధాముని కైంకర్యములోనుండగ తిరుమ

క్షేత్రమునందు శ్రీవెంకటేశ్వరులు యితరమతస్థులవలన ఆక్రమింప బడియున్నారని విని అచ్చటికేగి ఆపురమతస్థులను జయించి వారిని పారదోలి, ఆ తిరువేంగడముడయానుకు యెప్పటియట్లు వైష్ణవత్వం ప్రకాశించునట్లుజేసి వారికి యాచార్యులై ప్రకాశించి నాతిరుమల లో మూడురోజులుండి వెనుక దిగువతిరుపతికి వచ్చి నచ్చట పెరియ తిరుమల నంబిగారి గృహముజేరి నొకసంవత్సరము యితిహాస శ్రేష్ఠ మైన శ్రీమద్రామాయణ కాలక్షేపంబులు వారిచే వినుచుండిరి.

వెనుక శ్రీరంగక్షేత్రమున జేరియుండు కాలములో పశ్చిమ దేశమునందు చోళరాజుని అక్రమంబులువిని, నచ్చటి మిదునసాళి గ్రామంబుబోయి వడుఘనంబిని శిష్యునిగా జేసుకొని విష్ణువైష్ణవ ద్వేషియగు చోళుని క్రిమికంఠుడై నశించిబోవునట్లు శపించి, తొండ నూరిలో నంబినిగలశి విఠలదేవరాయుని పుత్రినింబట్టిన పిశాచం బును నివర్తించి, యేకకాలంబున నేతెంచిన పండ్రెండువేల జయిను లను వారిపూర్వాంశపు ఆదిశేష సహస్ర ఫణామండలంబుతో వాదంబున జయించి వారలను శిష్యులుగ జేసుకొని నచ్చట శింగరు సన్నిధిలో కొద్దిరోజులుండగా వారిస్వప్నములో తిరునారాయణులు యానతిచ్చిన ప్రకారం విఠలదేవరాయుని సహాయముచే తిరునారా యణపుర మహాక్షేత్రమునకు వచ్చి కోవెల గోపురమండపాదులు గట్టించి బ్రహ్మోత్సవంబు యాదిగాగల వైభవంబులను శ్రీపాంచ రాత్ర సాత్విక సంహితతో ప్రోక్షణాది తిరువారాధనంబులు శ్రీరంగ రాజభట్టరుచే జేయించి పండ్రెండు సంవత్సరంబులు నచ్చటయుండి తుదకు యథాప్రకారం శ్రీరంగక్షేత్రమునకు బోవ నుద్యుక్తులై యుండ అచ్చట అర్చకపరిచారక మొదలగు యేబదిరెండుగురు వీరిని విడిచియుండ మనసులేనివారై యుండునది రామానుజాచార్యులు

గనుంగొని, వారి ప్రతిబింభమును నొక అర్చావిగ్రహంబుగ యేర్పా టుజేసి సంప్రోక్షణాదులు గావించి నావిగ్రహమును వారుగాఢాలింగనముచే ప్రాణప్రతిష్ఠజేసి యావిగ్రహమునకు ముందు తెరచాటు వేయించి ఆ యేబదిరెండుగురులను జూచి మీరు యీావిగ్రహంబుతో మాట్లాడితిరేని నదియునుం మీాతో మాట్లాడగలదని రామానుజాచార్యులు జెప్ప, ఆప్రకారమే వారలు నావిగ్రహమును కొన్నియంశంబులడుగ వారికి యావిగ్రహము ప్రత్యుత్తరంబిచ్చినది జూచి విస్మయంబంది నా యతిరాజులవారికి శ్రీరంగయాత్రకు సెలవిచ్చిరి.

ఇట్లు రామానుజులువారే గోరి వారి ప్రతిబింబమును కలుగజేసి తిరునారాయణ పురములో నుంచిన యా విగ్రహమునకు తానుగుంద త్తిరుమేని యనియు,

శ్రీపెరుంబూదూరిలో తన్నాశ్రయించిన భాగవతులు శ్రీయతిరాజులవారి బింబము అనగా అర్చారూప విగ్రహము జేయించి శిల్పి తనపోకరతో కండ్లను దెరుచునపుడు యాపోకర దప్పినందుచేత శ్రీరంగములోయుండు నా ఉడయవరుల కంటియందు రక్తముగారగా అప్పుడచటనున్న వారలు యిదేమని యడుగ శ్రీపెరుంబూదూరిలో జరుగు విషయమును దెల్పిరి. అట్లు శ్రీపెరుంబూదూరిలో యవతరించిన నాయర్చావిగ్రహమునకు తమరుగంద త్తిరుమేని యనియు,

శ్రీరంగదివ్యక్షేత్రములో వారిచరమవిగ్రహమును (అట్లనగా జీవమువదలిన వారిశరీరము) అట్లనే ప్రతిష్ఠించినందున తానాన త్తిరుమేని యని ప్రసిద్ధము.

పూర్వము నమ్మాళ్వారులవలన ఆళ్వారుతిరునగరియందు ఉడయవర్ల అవతారకాలమునకు మూడువేల సంవత్సరములకు

ముందే శ్రీమన్నాథమునులకు అనుగ్రహించి సేవించపెట్టబడిన యా మహానుభావులను, శ్రీమన్నాథమునులు ఆరాధించి ఉయ్యక్కొండారు, మణక్కాల్‌నంబి, శ్రీయాళవందారులచే నారాధింపబడిన యావిగ్రహామునకు భౌమ్యధాచార్యులని జెప్పుదురు.

ఇప్పటికిని నాభౌమ్యధాచార్యులగు ఉడయవరులకు ఆళ్వారు తిరునగరియందు సన్నిధిగోపుర ప్రాకారమంటపంబులును, మాఢ వీదులును గలవు.

ఇట్లు చతుర్విధ తిరుమేనులు కలిగిన యారామానుజులు వారు తిరునారాయణపుర మహాక్షేత్రములోని శ్రీ తిరునారాయణ సంపత్కుమారులను విడిచి వచ్చుటకు మనసులేనివారై కడపట సన్నధిలోనున్న యేబదిరెండు స్వాములతో సన్నిధి కైంకర్యము లును పెరుమాళ్ళ తాయార్లను బహుజాగ్రతతో జూడవలయునని కట్టుదిట్టములు యాజ్ఞాపించి శ్రీరంగక్షేత్రమునకు తరలిబోయిరి.

నిదర్శనములు.

పెరుమాళ్ళ సన్నిధకి తూర్పు కూరత్తాళ్వారు సన్నిధియు, ఆసన్నిధికి కొంతప్రక్కన పిళ్ళలోకాచార్యుల సన్నిధియునున్నది. శ్రీ సంపత్కుమారుల సన్నిధికి యెదురుగనున్న స్థంభములో భద్రులైన రాజఉడయారు విగ్రహమున్ను, బయట ముమ్మడి కృష్ణరాజ ఉడయారును, వారి ప్రియభార్యలగు నల్గురు మహారాణులతో శిలా రూపముగనున్నారు.

దేవస్థానమునకు ముందుభాగములో బ్రహ్మాండమైన బదిరి వృక్షమును బదిరి నారాయణస్వామివారి దేవాలయమును దానికి వెనుకభాగమున యతిరాజులవారివలన కట్టంబడిన యతిరాజస్వామి

మఠంబును, దక్షిణమాఢవీదిలో వానమామలస్వామి మఠమును, వెనుక భాగమున పట్టాభిరాముల సన్నిధియు, దానికి కొంతదూరములో పరిశుద్ధమై పానమునకు యోగ్యమైనటువంటి శైల్యరాజ కొలనున్ను, సన్నిధి ఉత్తరమాఢవీదిలో శ్రీమనవాళ మహామునుల సన్నిధియు, రాజవీదిలో వసంతోత్సవ బంగళాయును, దానికెదురుగ వేదాంతాచార్యుల సన్నిధియునున్నది.

వైరముడి మహోత్సవమునకు ముందుదినము మైసూరు రాజసంస్థానమునుండి వైరముడియును, రాజముడియు రాజభటులు (తురుపుసిపాయిలు)తో బయిలుదేరి ఆరాత్రి శ్రీరంగపట్టం జేరి నచట పెరుమాళ్ళసన్నిధిలో తిరువారాధనలు కొనియాడి మరునాడుదయంబున బయిలుదేరి మార్గమధ్య మంటపములలో జరుగు తిరువారాధనలు గైకొని నతికుతూహలంబులతో నాటి సాయంసమయము సుమారు నాలుగు ఘంటలకు యీ తిరునారాయణపురము జేరి సన్నధి మర్యాదలతోడను అధికారులతోడను మాఢవీదులు ప్రదక్షణముజేసి సన్నిధిలోపలనున్న శ్రీరామానుజులవారి ఆలయంబునకు ముందుగా వేంచేయుదురు. పిమ్మట ఆవైరముడిని సంపత్కుమారులకు సమర్పించి గరుడవాహనముతో తిరువీధి పురప్పాటు జేయించి వెనుక సన్నిధికి నెదురుగనుండు వాహనమంటపమునందు దిగి యీ వైరముడిని యెత్తించి రాజముడిని సమర్పింతురు. మరునాడుదయము సుమారు పదిఘంటలకు వైరముడిమాత్రము యథాప్రకారము రాజభటులతో మైసూరు సంస్థానమునకు తీసుకబోదురు.

రాజముడిని బ్రహ్మోత్సవ తీర్థవారిపర్యంతము సమర్పించుచుండి యథాప్రకారం మైసూరు సంస్థానమునకు తీసుకబోదురు.

పూర్వము భాదుషా సంపత్కుమారులగు అర్చావిగ్రహమును రామానుజులవారికిచ్చినపుడు తమ ప్రియపుత్రికయగు వర

నందినిని జేర్చి పంపిరికదా, నపుడు తనకుమారుడు వాని అప్పగారగు వరనందినితోడ యీ తిరునారాయణపురంబునకు వచ్చి యచ్చట జరిగిన బ్రహోత్సవాది వైభవంబులను తనకనులార జూచిపోయి, తనతండ్రియగు భాదుషాతో వివరించి జెప్ప నాతండును దానిని జూచుటకై తన భంధువర్గంబులతో నచ్చటికివచ్చి వారి జామాతకును, పుత్రికకును జరుగు మహోత్సవములను జూచి సంతోషించినవాడై పలువిధ బహుమానంబులును ననేక భూములును పెరుమాళ్ళకు మాన్యముగా విడిచిబోయెను. అందునుబట్టియే తురకలు ఆ కాలము మొదలు నేటివరకును దేవాలయ బలిపీటమువరకును వచ్చి దేవుని ప్రార్థించిబోయెదరు.

రామానుజులువారు ఢిల్లీనగరమునకు బోయినపుడు వారితో భగవత్ కైంకర్యార్థమై సహాయభూతులగు వచ్చిన వారిప్రియశిష్యకోటులగు పంచములకు కులత్తారను బిరుదునిచ్చి వారి ఉపకారసూచకముగ బ్రహ్మోత్సవకాలమున రథోత్సవము మొదలు మూడు రోజులు పర్యంతము శ్రీకల్యాణి పుష్కరణిలో స్నానమును, సన్నిధిలో పెరుమాళ్ళ తాయార్ల సేవయును దేవాలయ ప్రదక్షిణమును ఉడయవర్ల సేవయును లభించునట్లు రామానుజులువారు ఆకాలమునందు జేసిన యేర్పాటు యిప్పటికిని తప్పక జరుగుచున్నది.

శ్రీజగన్నాథములో ప్రసాదపావనత్వం, తిరుమలలో తీర్థపావనత్వం, తిరునారాయణ పురములో స్పర్శపావనత్వం ప్రసిద్ధము.

వీటిని శ్రీమద్రామాయణము, గురుపరంపరా ప్రభావము, ప్రపన్నామృతము మొదలైన గ్రంథములలో జూడ దెలియును.

శ్రీ తిరునారాయణపుర మహాత్మ్యము

సంపూర్ణం.